The First Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu Newspaper
for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు దక్కన్

Golconda Patrika. Hyderabad, Dn.

సంపుటము ౮ | శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ ర జ్యేష్ఠ బ॥ ౮ శనివారము 25-6-32 | సంచిక ౧౫



## నూతన భారతరాజ్యాంగ చట్టమును గూర్చి మాంఛెస్టరు గార్డియను సమాచారము

లండను, జూన్ ౨౦:—

నూతన రాజ్యాంగ చట్టమును గూర్చి సూచన

«నూతన భారత రాజ్యాంగ చట్టము సెప్టెంబరు అక్టోబరు నెలలలో సిద్ధమగును. అటుపిమ్మట పలుకుబడిగల నాయకులు ప్రవీణులు మన్నగువారు దానిని గూర్చి యిష్టాగోష్ఠిగా నాలోచించెదరు. ఆ సభలో తమ అభిప్రాయమును తెలుపుటకు కాంగ్రెసుతో మితవాదులు సమ్మతించు నెడల వారిని గూడ పిలువనగును.

తరువాత ఆబిల్లు పార్లమెంటులో ఉపపాదింపబడును అపుడు దానిని గూర్చి చర్చించుటకు పార్లమెంటువారొక సంయుక్తోప సంఘమును నియమించెదరు. ఆ సంఘమునందు ప్రభువుల సభ సభ్యులును ప్రజల సభ సభ్యులును గూడ నుందురు. వారు భారతదేశమునందలి వివిధపక్షముల వారి అభిప్రాయములను తెలుసుకొనగోరెదరు కాన ౧౯౩౩ ఏప్రిలు నెలలో యీస్టరు సెలవులకు ముందుగా ఈ చట్టము పార్లమెంటు సభలో నామోదింపబడిన ౧౯౩౩ డిసెంబరు నెలలలో కిస్తుమసు సెలవులనాటికి రాష్ట్రీయ స్వపరిపాలన మమలులో పెట్టబడును. దౌర్జన్యపక్షమునకు చేరినవారిని తప్ప లెక్కిన ఖైదీలనందరిని యీలోగానే వదలివేయవలెను. వారు రాష్ట్రీయ శాసనసభల ఎన్నికలకు పోటిచేయుటకు వారికి అవకాశముండుటకు వీలైనంత త్వరగా వారిని వదలవలెను అని ఒక ప్రత్యేకవిలేఖరి మాంచెస్టరు గార్డియను పత్రికకు వ్రాసెను.

అల్పసంఖ్యాకుల సమస్యనుగూర్చి ప్రశ్న
హోరు గారేమియును తెలుపజాలననుట

"శాసన సభలో వివిధసంఘముల (కమ్యూనిటీసు) ప్రతినిధులసంఖ్యల నిర్ణయ మెపుడు ప్రకటింపబడును,, అని లేబరుసభ్యుడు మేజరు మిలినరుగారు పార్లమెంటులో నడిగిరి ఇపుడు నేనేమియును చెప్పజాలనని హోరుగారనిరి.

బర్మా ఓటరుల పట్టికలు మంచల తయారు చేయుటపిమ్మటలేదని హోరుగారుపలుకుట

« బర్మా శాసనసభకు వోటరుల పట్టికలు క్రొత్తగా సిద్ధపరుపవలెనా" అని పార్లమెంటుసభలో డేంకు గ్రీనుఫెలు (లేబరు) గారు సూచించిరి.

ఇపుడున్న పట్టికలో అర్హతగల యితరుల పేర్లుగూడ చేర్చబడెను. అపుడవి క్రొత్తగా తయారు చేయబడినవారితో తుల్యములే యగును" అని హోరుగారనిరి.

రంఛోడు లాలు మిల్లునందు
రూ. ౫౦౦౦ నోట్లు జప్తు

అహమదాబాదు, జూన్ ౨౦;—

పోలీసువారు క్రొత్తప్రతి మిల్లునకు పోయి రూ౫౦౦౦ నోట్లను జప్తు చేసిరి. ఢిల్లీ కాంగ్రెసు అధ్యక్షత వహించిన సేటు రంఛోడులాలు మిల్లుయజమానిపై విధింపబడి జరిమానాకై యీద్రవ్యము తీసికొనిరి, మిల్లు ప్రజెంటులగు సేటు గిరిధరలాలుగారు యీమిల్లు రంఛోడులాలుగారి ఆస్తి యేమియు లేదనియు, అందుచే పోలీసువారు ఆస్తి జప్తుచేసినచో న్యాయస్థానములందు చర్యగైకొనబడుననియు దెలిపిరి.

సంయుక్త రాష్ట్రములపై దీలస్థితి
మాళవ్యా విచారణ సంఘమువారు పనిని ప్రారంభించుట

అలహాబాదు, జూను ౨౦;—

సంయుక్త రాష్ట్రములలో రాజకీయ ఖయిదీలకు చాలయిబ్బందులు కలుగుచున్న విషయమును గూర్చి విచారణ చేయుటకు పండిత మాళవ్యా గారిచే నియమింపబడిన సంఘమువారు నేటిచట

# అఖిల ప్రపంచ మద్యపాన నిర్మూలోద్యమ శతవర్షోత్సవ సభ

భారత దేశమునందలి మద్యపాన నిషేధమును గూర్చి ఆ సభలో చర్చజరుగుట.

భారతీయులలో అత్యధిక సంఖ్యాకులు మద్యపానమును నిర్మూలింప గోరుచున్నారు. వారికి రాజ్యాధికారము లభించిననే గాని యిది ఫలించదు.

లండను జూను 20:—

క్రెస్టను నగరవాసులగు యేడుగురు ప్రముఖులు కలసి పూర్వము నిర్మించిన అఖిల ప్రపంచ మధ్యపాన నిర్మూలనోద్యమముయొక్క శతవర్షోత్ససభ యీనెల 18 తేది శనివారము నాడు లండను నగరమున క్రిషను భవనమున జరిగెను.

ఆసభకు ఇండియా మున్నగు 32 దేశ ప్రతినిధులు వచ్చిరి. మొత్తము 32 వేలమంది సమావేశమైరి. ఈ సభ అంత్యదిన సమావేశము నేడు గ్యాలి అర్నాల్డు ప్రభువు అధ్యక్షతక్రింద జరిగినది.

"మద్య విక్రయము వలన ప్రపంచమునందు అన్ని దేశములవారికి యిప్పుడు నష్టము కలుగుచునేయున్నది. కావున చివరకు దీనిని బహిష్కరించుటయే కర్తవ్యము. అమెరికా దేశమునందు మద్యపానము నిషేధింపబడినది. కాని యిపుడది రద్దుపరుపబడునని మద్యపానమునందు అభిమానగలవారు తమపత్రికలలో ప్రచురించు నిర్మూలమునకు అనుకూలమగు వార్తల వారు అణచివేయుచున్నను అమెరికా దేశమువారు ఎన్నడైనను గాని యీ నిషేధమును రద్దుపరచెదరని నేను నమ్మజాలను. మన దేశమునందుగూడ మధ్యపాన నిషేధమును ఆమోదించువారి సంఖ్య మనము తలచుచున్న దానికంటె మిక్కిలి హెచ్చుగానే యుండును. అని అర్నాల్డు ప్రభువు నుడివెను.

ఇండియాలో కల్లు, సారా దుకాణములవద్ద పికెటింగు జేయుచున్న వారిని చాలమంది ప్రభుత్వమువారు నిర్బంధించుచున్నారు. కాని ప్రజలలో త్రాగుడునందు నిరసనభావము యెక్కువగానే యున్నది. నేను ఇండియాలో 45 సంవత్సరములు గడపితిని. నా స్వానుభవము వలన ఇండియాలో అన్ని తెగలవారును త్రాగుడు నిరసించి దానిని రూపుమాపుటకు ప్రయత్నించుచున్నారని రూఢిగా చెప్పగలను. దీనికి ప్రభుత్వాధికారము ప్రజలకు లభించుట ముఖ్యమై యున్నది. ఇండియాలో అధికసంఖ్యాకులు తమకు స్వాతంత్ర్యము వచ్చిన వెంటనే త్రాగుడును రూపుమాపవలెనని నిశ్చయులై యున్నారు. ఇండియాలో ధనార్జనము జేయగోరునట్టి స్కాట్లండు మున్నగు దేశముల వారు అపుడు తమ విస్కీనైన వదలవలసి యుండును, లేక ఇండియానైన వదలవలసి యుండును అని రివరెండు హెబ్బరు ఆండర్సనుగారు నుడివిరి.

## బొంబాయి అల్లరులు

కొద్దిగా కొట్లాటలు జరుగుట

బొంబాయి జూన్ 21—

బొంబాయి సాంఘిక వైషమ్యములు చాలవరకు తగ్గినవి. ఒకహిందూ మిల్లుపనివాడు పనికై పోవుచుండగా, బైకుల్లా క్లబువద్ద నొక మహమ్మదీయునిచే పొడువబడెను. తీవ్రగాయములు తగిలినవి. అతనిని వెంటనే ఆసుపత్రికి తీసుకొనివెళ్లిరి. శరీరముమీద 8గాయములున్నవి, తుంటరులనింకను అరెస్టుచేయుచునేయున్నారు, నేడు 19 మందిని అరెస్టుచేసిరి.

నేడు సాయంకాలము నల్లాబజారులో నింకొక హిందువును పొడిచిరి. అతనిని ఆసుపత్రికి తీసికొని వెళ్లిరి.

మూడవ రాజధాని మేజిస్ట్రేటుగారి యెదుట లూటీకేసులు మామూలుప్రకారము తీర్పునకువచ్చెను. కొందరిని జామీనుమీద వదలిరి. కొందరిని రిమాండునందుంచిరి.

20 మందికి వారము మొదలురోజులవరకు ఖైదు విధించిరి. జరుమానా రు 20 మొదలు రు100 వరకు విధించిరి. 100 మందికి పైగా రిమాండునందుంచిరి. మే నెల 17 తేదీని బరోడా స్టోర్సులో రు 7000 పైగా లూటీజెసినందులకు నలుగురు హిందువులకు ఒకరోజు విడిశిక్ష 150 రు జరిమానా లేక 3 నెలలు ఖైదు విధించిరి.

## ట్రాన్సువాలు లాండు టెన్యూరు చట్టము

సవరింపబడిన చట్టములోని షరతులు

సిమ్లా, జూన్ 16:—

ఈ చట్టము దక్షిణాఫ్రికా శాసన సభలో సామోదింపబడినది. అచట భారతీయులును భారత ప్రతినిధి సంఘమువారును తెలిపిన ఆక్షేపణల ననుసరించి చట్టములో భారతీయుల కనుకూలముగా చాల మార్పులు చేయబడెను. అచటనున్న ఆసియాఖండవాసులు కొన్ని ప్రత్యేకస్థలములందలి భూములను మాత్రమే కొనవలెను అను నిబంధన యిపుడు రద్దుపరచబడెను. అట్టి నిబంధన గల 130-131 సెక్షనులను కొన్ని భూముల విషయమున అమలు జరుపకుండుటకు దేశీయమంత్రికి అధికార మియ్యబడెను. అతడటుల చేసినచో ఆభూములను కొనుటకును వశపరచుటకును ఆసియాఖండవాసులకు అర్హత కలుగును. అటుల నా సెక్షనులు ఆభూములకు వర్తింపవలెననని మంత్రి సర్టిఫికెటు నిచ్చినచో ఆసియాఖండవాసులు ఆభూములను కొనుటకు అధికారులు ఎట్టి అభ్యంతరమును కలిగింపగూడదు.

1930 మే నెల మొదటి తేదీలోగా ఆసియాఖండవాసుల పేరిట రిజస్టరు చేయబడిన భూములకు వారికిగలహక్కు కాపాడబడును. దీనినిగూర్చిన మినహాయింపులన్ని రద్దుపరచి ఆసియాఖండవాసులకు సంపూర్ణమగు హక్కు లియ్యబడెను.

1930 మే నెల మొదటి తేదీలోగా యూరోపియను ట్రస్టీలద్వారాను సహియాటికు కంపెనీద్వారాను ఆసియావారు అనుభవించుచున్న భూములహక్కుగూడ కాపాడబడెను.

1919 తరువాత ఆసియావారు కొన్ని భూములలో తాత్కాలికముగా యూరోపియనుల వశమునందున్న భూములకుగూడ ఆసియావారికి సంపూర్ణమగు హక్కులు కలిగినవి. వీటినిగూర్చి దావాలను చేయనవసరములేదు.

1932 మే నెల 1వ తేదీలోగా ఆసియావారు ప్రైవేటు కంపెనీలలో కొన్ని వాటాలహక్కుగూడ తొలగదని యిపుడు స్పష్టముగా వ్రాయబడెను. ఆవాటాలను దరిమిలా నతడు మరియొకరికి మార్చియుండగూడదు. ఒక ఆసియా ఖండవాసునివలన వారసత్వరీత్యా మరియొక ఆసియాదేశీయునకు సంక్రమించిన భూములహక్కుగూడ తొలగదని నిర్ణయింపబడెను.

1919 మే నెల మొదటి తేదికి పూర్వము ఒకడు భూములను ఒక స్థలమును కొనియుండినపుడు ఆ తేదికి దరిమిలాను ఆ స్థలముననే మరల నతడు భూములను కొనినచో వాటిహక్కు రద్దగునను సంశయముగూడ నిపుడు పూర్తిగా తొలగిపోయినది. 1930 మే నెల మొదటి తేదీలోగా కొనబడిన భూముల కన్నిటికిని హక్కుగలదని యిపుడుస్పష్టపరుపబడెను.

లైసెన్సు ఇచ్చుటకు సర్టిఫికేటు ముఖ్యముగా నుండవలెను. దీనిని స్థానికోద్యోగులు నిరాకరించినచో జిల్లా మేజిస్ట్రేటుకు పిటిషను పెట్టవలెను. అతడు సాక్ష్యమునుబట్టి హక్కును స్థిరపరచును.

"ఇపుడు ఇతర దేశములవారు నివసించుచున్న వీధులలో కాపురమున్న ఆసియాదేశీయులు ఆవీధులలో నుండి వెడలిపోవ నవసరములేదు. ఈ హక్కును గూర్చి విచారించుటకు ఒక జడ్జి అధ్యక్షతక్రింద నొక నిష్పాక్షికసంఘ మేర్పరుపబడును." అని శాసన సభలో డాక్టరు మలను గారు తెలిపిరి.

కమీషనును గూర్చి యింకను సమాచారమేమియును తెలియలేదు.



## స్త్రీలు జేయవలసిన దేమి?

విద్యానిపుణులకు రామానంద చటర్జీగారి హితము

"సావిద్యయా విముక్తేయి" అను సంస్కృత శ్లోకమును మరువకుందురని నావృఢ విశ్వాసము అధ్యాత్మిక, జ్ఞానైక, సామాజిక, రాజకీయ, ఆర్థిక, విముక్తియే యీ కాలమున ఆశ్లోకమునకు సరియైన అర్థము"

మనగృహములను, సామాజిక పరిస్థితులను బాగుపరచవలసినది. మగవారమైన మావంటి స్త్రీలగు మీ కెక్కువబాధ్యతగలదు."

"అధికారముకొఱకెచ్చట మనుష్యులు ప్రగ్గుచున్నారో, అచ్చటస్త్రీలు, ప్రజాసేవ యొనరించి, ప్రపంచశాంతికిని, నిర్మలత్వములకును పాటుపడుచుందురని కొన్ని చిహ్నములు కనుబడుచున్నవి."

స్త్రీ, పురుషులయందు నీతిశాస్త్రమును సమానముగ పెంపొందింపవలయును. అదియే మనస్త్రీల "తపస్సు" ముఖ్యమైనపనియైయున్నది. వారు కూడగలసి మనరాచయములను అధ్యాత్మికముగను, నిర్మలత్వముగను నొనరించవలయును."

## షౌకతాలీగారు దాఖలుచేసిన కంప్లయింటు

ఫ్రీ ప్రెసు పత్రికా సంపాదకుని మీదను ముద్రాపకుని మీదను ఫిర్యాదు చేయబడెను

బొంబాయి, జూన్ ౧౪:—

ఇటీవల బొంబాయిలోజరిగిన హిందూమహమ్మదీయ కొట్లాటల సందర్భములో బొంబాయిలో వెలువడు ఫ్రీ ప్రెస్ జర్నలు అను ఆంగ్లేయ దినపత్రికలో మే ౧౯ తేదీని సంపాదకీయ వ్యాసమొకటి ప్రకటింపబడెను. ఆ సంపాదకీయ వ్యాసములో మహమ్మదీయుల అల్లరులకు గల కారణములను కారణభూతులను గూర్చి కొన్ని వృత్తాంతములును తెలిసికొనబడిన రహస్యవిషయములును వ్రాయబడెను. ఖిలాఫతు సంఘమువారు దెబ్బలు తగిలినవారిని మృతులైనవారిని గొంపోవుటకును ఆస్పత్రులకు చేర్చుటకును ఆర్తత్రాణసేవ చేయుటకై పూనుకొని మోటారుకారులను తీసుకొనివచ్చిరనియు అట్టి ఆర్తత్రాణ సేవార్థమై వచ్చిన మోటారుకారులలో గూడ రక్తసిక్తమైన కత్తులు కర్రలతో మహమ్మదీయులు కొందరుండిరనియు సదరుపత్రికలో ప్రకటింపబడెను. సదరు ఆర్తత్రాణ ... ఖిలాఫతు కమిటీవారిచే నియమింపబడిన వారగుటవల్లను సదరు ఖిలాఫతు కమిటీకి షౌకతాలీగారు నాయకు లగుటవల్లను అట్టి వార్తలను ప్రకటించుటవల్ల షౌకతాలీగారికి అప్రతిష్ఠ కలుగజేయబడెననియు హిందూ మహమ్మదీయ కలహములను ... సభలో షౌకతాలీగారి ఉపన్యాసములను ... విషయములో షౌకతాలీగారు బొంబాయి గవర్నరుగారితో మాట్లాడిన విషయములను గూర్చియు షౌకతాలీగారు ఆక్షేపించిరి. అట్టి ప్రకటనలన్నియును తమకు ప్రతిష్ఠాభంగకరముగా నున్నవని షౌకతాలీగారు ఫిర్యాదు చేసిరి.

నోబ్రీఆను బారిస్టరు షౌకతాలీగారి పక్షమున వాదించుచున్నారు.

ఫ్రీ ప్రెస్ జర్నలు సంపాదకుని ... సదానందు గారికిని పత్రికా ముద్రాపకులగు వారికిని ... సమ్మనులు కీనలు కోడు ... ౫౦౦ సెక్షను ప్రకారము ... చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు గారిచే గతబుధవారము ... ఇయ్యబడెను.

## లాసేనుసభలో నొక ముఖ్యమగు పరిష్కారము

ఋణములను ఈసభ ముగియులోపుగా తీర్పు చక్కర లేదు

లాసేను, జూను ౧౪:—

ఇప్పుడు లాసేనులో జరుగుచున్న సభ పూర్తి యగువర కును ప్రస్తుతము జూలై నెలలో బ్రిటను దేశమునకు యితర దేశములవారు చెల్లింపవలసిన వాయిదా మొత్తములను చెల్లింప నక్కరలేదని సభలో సర్ జాను సైమనుగారు చేసిన సూచన ఆమోదింప బడెను.

### పూర్వ వార్తలు

జర్మని పక్షమున వానుపాపెనుగారు నేడు మాటలాడిరి. జర్మనివారు ఋణములను తీర్చ దలచుకొనలేదను సూచన చేయుటను కూడ కనబడలేదు.

పిమ్మట నెవిలీ ఛేంబర్లేనుగారు మాటలాడిరి.

"బ్రిటిషు దేశమువారు గొప్ప ఆర్థిక దృష్టిని కి ప్రాప్తి యుండినను తక్కిన అన్ని దేశములవారును ఋణములను రద్దుపరుచుటకు సమ్మతించునెడల బ్రిటిషు వారికి ౨౦ కోట్ల పౌనులు నష్టమువచ్చును. కాని అందులకు వారు సిద్ధముగా నున్నారు." అని ఛేంబర్లేనుగారు నుడివిరి.

సభలో ఛేంబర్లేనుగారు మాటలాడిన పిమ్మట హెరియెటుగారు మాటలాడిరి. "ఋణములను రద్దుపరుచుట వలన సమస్యలు కలుగును ఋణముల మొత్తములను తగ్గింపవలెనని ఫ్రాన్సు దేశమువారు తలచుచున్నారు" అని హెరియెటుగారు నుడివిరి.

ప్రస్తుతము వాయిదాలను చెల్లింపకుండుటకు బ్రిటను వారంగీకరించుటచే ఫ్రాన్సు, యిటలీ, బెల్జియం, జపాను దేశముల వారుకూడ సమ్మతించిరి.

(రాయిటరు)

లండను, జూను ౧౬:—

లాసేనుసభ జయప్రదమగు సూచనలు కన్పించుటచే అందరును ఆశాపూరితులై యున్నారు. నెవిలీ చాంబర్లేనుగారి అభిప్రాయమును ఆస్ట్రేలియా ప్రతినిధి ఆమోదించెను. మంగళవారము వరకు సభ ఆపుచేయబడెను. హైమర్ గ్యార్డ్ మగ్డొనాల్డుగారు శనివారము ఆదివారములలో తనివాలో నుందురు. కాని నిర్ణయములేక జర్మనీలో మరల గడువు నిచ్చుటకు నేటి యుదయమున సభలో నిర్ధారించుటచే ఫ్రెంచి వారు శంకించు చున్నారు. ఫ్రెంచి ప్రజలలో సంకట మేర్పడెను.

### అలహాబాదులో విచిత్రమైన వుత్తరువు

జయిలరు ఎదుట తమతమ బిడ్డలను తలిదండ్రులు శిక్షింపవలెనని మేజిస్ట్రేటు ఆజ్ఞాపించుట

అలహాబాదు, జూను 17:—

ఆరుగురు మైనరులు సత్యాగ్రహమున పాల్గొనినందుకు పోలీసువారు వారిని అరెస్టుచేసిరి వారిని జయిలరు ఎదుట తలిదండ్రులు అర్జీలు పెట్టుకొనిరి. జయిలరు ఎదుట తలిదండ్రులు వారిని శిక్షించినచో వారిని వదలివేసెదమని మేజిస్ట్రేటు తెలిపెను. అందులకు తలిదండ్రులు సమ్మతించి నేడు జయిలుకు వెళ్లి జయిలరు ఎదుట తమ బిడ్డలను చెప్పులు నులుపుట రెండు పలువాయించుట మున్నగురీతిని శిక్షించిరి. పిమ్మట వారిని వదలివేసిరి నేడు ఇద్దరికే శిక్ష వేయబడెను.

## H. E. H. Nizam's State Railway.

## హి॥ ఘ॥ నిజాం స్టేటు రైల్వే

## ప్రకటన.

### వికారాబాదు - బీదరు ఎక్స్టెన్షన్ రైల్వే తెరచుట.

౧౯౩౨ సం॥ జూలైనెల ౧ వ తేదినుండి, వికారాబాదు - బీదరు ఎక్స్టెన్షన్ రైల్వేలో యీ క్రింది వివరించిన స్టేషనులు, లోకలుకును, ప్రయాణీకుల త్రూ బుక్కింగుకున్నూ తెరువబడును.

| | |
|---|---|
| ౧ ఖానాపూర్ (నిజాం) | ౫ కల్గుపూర్ |
| ౨ హాలహాబర్గా | ౬ ముర్గ |
| ౩ శిద్దేశ్వర | ౭ బెలాకర్గా |
| ౪ భాల్కి | ౮ ఉద్గీర్ (నిజాం) |

ప్యాసింజరు బండ్ల కాలక్రమము యీ క్రింది విధముగ నుండును

| ౯ ప్యాసింజరు | | | | ౧ మిక్స్డ్ | | | |
|---|---|---|---|---|---|---|---|
| సికింద్రాబాదు | బ॥ | ... | ౬ - ౫౦ | ఉద్గీరు (నిజాం) | బ॥ | ... | ౭ - ౦౦ |
| హైద్రాబాదు బి. జి. | బ॥ | ... | ౭ - ౨౪ | బెలాకర్గా | ,, | ... | ౭ - ౩౬ |
| వికారాబాదు | చే॥ | ... | ౯ - ౨౪ | ముర్గ | ,, | ... | ౮ - ౧౦ |
| | | | మిక్స్డు | కల్గుపూరు | ,, | ... | ౮ - ౫౭ |
| | బ॥ | ... | ౯ - ౪౪ | భాల్కి | ,, | ... | ౧౦ - ౦౧ |
| మహామదాబాదు | చే॥ | ... | ౧౨ - ౫౧ | శిద్దేశ్వర | ,, | ... | ౧౦ - ౨౭ |
| బీదరు | బ॥ | ... | ౧౨ - ౫౮ | హాలబర్గా | ,, | ... | ౧౦ - ౫౬ |
| ఖానాపూర్ (నిజాం) | బ॥ | ... | ౧౩ - ౩౪ | ఖానాపూరు (నిజాం) | ,, | ... | ౧౧ - ౨౮ |
| హాలబర్గా | ,, | ... | ౧౪ - ౮ | మహమ్మదాబాదు | చే॥ | ... | ౧౨ - ౨౬ |
| శిద్దేశ్వర | ,, | ... | ౧౪ - ౩౩ | బీదరు | బ॥ | ... | ౧౨ - ౫౫ |
| భాల్కి | ,, | ... | ౧౪ - ౫౬ | | చే॥ | ... | ౧౬ - ౩౦ |
| కల్గుపూర్ | ,, | ... | ౧౬ - ౦౧ | వికారాబాదు | | | ప్యాసింజరు |
| ముర్గ | ,, | ... | ౧౬ - ౪౭ | | బ॥ | ... | ౧౭ - ౫ |
| బెలాకర్గా | ,, | ... | ౧౭ - ౨౨ | హైద్రాబాదు బి. జి. | బ॥ | ... | ౧౯ - ౧౪ |
| ఉద్గీర్ (నిజాం) | ,, | ... | ౧౮ - ౦౦ | సికింద్రాబాదు | చే॥ | ... | ౧౯ - ౪౨ |

చీఫ్ కమ్మర్షియల్ మ్యానేజర్సు ఆఫీసు
సికింద్రాబాదు (దక్కన్)
౨౧ జూన్ ౧౯౩౨

(అనుమతిని)

డి. బి. క్రెవరు

చీఫ్ కమ్మర్షియల్ మ్యానేజరు
చీఫ్ ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు

## హిందూ దేశ పరిశ్రమ

పూర్వము ఇతర దేశములకు మనదేశమునుండి కోట్లకొలది రూప్యముల విలువగల దశాకాచు జరీనలు మొదలగు అమితనాణ్య నాజూకుతలు గల వస్తువులు వెళ్లుచుండెడివి. అపుడు ఆయా గవర్నమెంటువారు వాటిని అడ్డగించుచు శాసనములు చేసిరి. అంతటితో ఆయా దేశస్థులే వాటిని తయారుచేయ మొదలిడిరి. మొదట మోటుగా చేసిరి. ధర లధికముండెను. కాని రానురాను వాటిని తయారుచేయుటలో అద్భుతప్రజ్ఞ కలవారై వారి దేశమునకే గాక యితర దేశములకు కూడ అతివిరివిగ వస్తువులను వారిపుడు సప్లయి చేయుచున్నారు. చూచితిరా! సోదరులారా! పిల్లవాడు మొదట బాగుగ నడచుటలేదని వానిని ద్వేషింతురా వానికాలు సాగకుండ ప్రయత్నింతురా? క్రమముగా పోషించగా పోషించగా ప్రాకుటనుండి తప్పటడుగులు వాటినుండిదొడ్డికాళ్లుగ నడచుట పిమ్మట గోడలు పట్టుకొని నడచుట పిమ్మట నెమ్మదిగ తనంతటతాను నడచుట, తరువాత నిమ్మళముగ పరుగెత్తుట, పిమ్మట ఉరుకుట గంతులవాయు మనోవేగములతో పరుగెత్తుట అలవడును. అంతియకాని మొదటే వానిని అడ్డుపెట్టి పోషించనిచో ఏమి జరుగును అటులనే మనదేశములో తయారైన వస్తువులు కూడ మొదట మోటుగనుండ వచ్చును. నాణ్యము తక్కువగ నుండవచ్చును. ధర లధికముగ నుండవచ్చును. వీటినన్నిటిని సహించి మనము వాటిని పోషించిననేతప్ప అవికూడ వృద్ధిపొంది త్వరలోనే మీ అనుగ్రహము సంపాదించి మీకానందము లాభము గూర్పగలవు.

ఇందులకు సాంఘికబలము మిక్కిలి అవసరమని ముందే తెల్పియుంటిని. సంఘావలంబనము లేనిదే ఏపనియు వృద్ధిజెందజాలదు. గాన మీరందరూ యిపుడే ఈ క్షణమునుండే స్వదేశీవస్తులకొనెదమని ప్రతిజ్ఞ బూనవలెను. మీరందరూ బై యిండియను లీగులో మెంబర్లుగా చేరవలెను. కేవలము మనస్సులలో ఉత్సాహమున్న లాభములేదు. కార్యరూపము దాల్పవలెను. కుండలో అన్నమున్నంత మాత్రమున ఏమిలాభము నోటిలోనికి రావలెను, కడుపునిండవలెను.

## ప్రస్తుత గాధ

మాకందరకు కావలసిన వస్తువులకై ప్రతివారు గ్రామాంతరమునకు వెళ్లి తెచ్చుకొనుట మిక్కిలి కష్టము. అయినను మనకు కావలసిన వస్తువులు ఎక్కడెక్కడ దొరుకునో తెలియదు. గాన ప్రతి గ్రామమునందును ఆ గ్రామమునకు కావలసిన వస్తువులతో స్టోర్సు ఒకటి యుండుట చాల ముఖ్యావసరము. ఇట్టి ముఖ్యతమమగు విషయమునకూడ గ్రహించి స్టోర్సును ప్రారంభించుట. అందరికికూడ అత్యంత ముదావహ విషయము మీరు ఈ దినమున స్టోర్సు ప్రారంభించుటతో తృప్తిజెందక బాగుగా ప్రచారముచేసి మీ స్టోర్సును పరస్పర సహాయముతో వృద్ధిపరచుకొని, దేశసౌభాగ్యమునకై తోడ్పడి ఈ చుట్టుప్రక్కలకు మీ గ్రామమును మార్గదర్శిక జేయుదురుగాక యనికోరుచు, మీ ఉద్యమమునకు సర్వేశ్వరుడు తనకృపను పూర్తిగ జూపుగాకయని ప్రార్థించుచున్నాను.

